# గోలకొండ పత్రిక

స్వభాను సం॥ర భాద్రపద శు॥ ౧౪ సోమవారము


## విద్యుత్తు

కొంతకాలము హైదరాబాదు ప్రభుత్వమువారు- "ఎలెక్ట్రిసిటీ వాడండి. ఎక్కువగా వాడండి. ఇంకావాడండి" అని మీదమీదా ప్రకటనచేసిరి. కాలంమారింది. పాటకూడ మారింది "తక్కువ విద్యుత్తునువాడండి- ఇంకాతక్కువవాడండి. లేకుంటే మీకు బాగా ప్రాయశ్చిత్తం అవుతుంది" అనే ధోరణిలో ప్రకటనలు వేయించినారు. పాపము పత్రికా సంపాదకు లందరున్నూ దానికి అనుకూలంగా తాళంకూడా వేసినారు. ఇంతలో ఇంతతల క్రిందగుటకు కారణం ఏం? యుద్ధంకారణము! యుద్ధానికి నేల బొగ్గు కావలెను. అందుచేత విద్యుత్తు సిద్ధముచేసే దానికి చాలకుండా వచ్చినది. కావున మీరంతా తక్కువ విద్యుత్తును వాడుకొండి. అని అంటున్నారు. వాడుకోకపోతే ఏం ప్రాయశ్చిత్తమనుకొన్నారు. రెండంతల రేటు వసూలుచేయుదురు. చెప్పకుండా తంతీలు కత్తరించిపోతారు. మళ్ళీ "సిగులాం సిబానిస" అంటే మళ్ళీ ఫ్యాజ్లుపుచ్చుకొని ఖబర్దార్ అని అనుగ్రహించిపోతారు. మళ్లీ పొరపాటులోనైనాసరే ఎక్కువ కాలిస్తే ఎట్లా? నిష్కృతిర్నవిద్యతే!!

ఇంత అవస్థ వచ్చినది నగరవాసులకు. మా ఆముదందీపాలే నయమండీ అని పల్లెజనులంటారేమో? వారికిన్నీ గ్రహచారం తప్పలేదు. నూనె ఆముదం ధర విపరీతముగా పెరిగిపోయినవి. ఇక కిరోసన్ "గ్యాస్"నూనె పేరెత్తవద్దండి. కిరోసన్‌నూనెఅంటే అదేదో కాశీతీర్థంవంటిదైపోయింది. మనిషిమనిషికి చేరెడే కొలిచిపోస్తారు. అదిన్నీ దినదినం దొరకదు. ఇస్తానున్ననాడు దుకాణాలముందు గుంపులుగుంపులు. వారిలో వారికి ముష్టియుద్ధం, పువ్వుపువ్వు ఎన్నో రేషనుదైనవి. ఎన్నో కానున్నవికదా. ఇది చాలామంచిసమయము "క్యూ"అను పద్ధతిని ప్రవేశపెట్టుటకు. మనదేశములో జనులు మోటైపోయినారు. మర్యాదలులేవు. మోచేతులబలం కలవారు, పెద్దనోరుకలవారు, కస్రతుచేసినవారు, వెనుకవచ్చినను త్రోసుకొని బలహీనులను ప్రక్కకునెట్టి ముందుకువెళ్లి తమ అభిమతాలు తీర్చుకొంటారు. ముందువచ్చినవానిపని పూర్తిఅయినతర్వాత రెండవవాడు అనుభావన జనులలో లేదు. దానిని రాష్ట్రమంతటను రైళ్ళలో బస్సులలో సినిమాలవద్ద, సభారంగములలో, స్త్రీపద్యనాలలో, దుకాణాలవద్ద- జనసమర్థనుకల ప్రతిస్థలములోను జనులు క్రమపద్ధతిపై తిన్నగా మర్యాద గావర్తించుకొనునట్లు ప్రభుత్వమువారు ఏర్పాటు చేయించవలెను.

నగరములోని నెలసారుకు [illegible] స్నదికనా ఇక ఎందులకైనా ఏమి కర్తవ్యమని ఆలోచించవలెను. ఇందుమించు అయిదుసంవత్సరాలక్రిందటి ప్రభుత్వమువారు కీవిద్యుత్తు ప్రణాళికను ప్రకటించిరి. దానిప్రకారము ౬౦ఏండ్లలో ౧౦కోట్లు వ్యయముచేసి జలపాతములద్వారా విద్యుత్తును రాష్ట్రములో ఎనిమిదిమూలలలోను సమగ్రముగా పల్లెలకుకూడా సప్లై చేయుటకు ఏర్పాటు చేయబడును అని వ్రాసియుండిరి. రాష్ట్రములో షోరాపూరు (సురపురం) వద్ద కృష్ణానదియొక్క స్వాభావిక జలపాతంకలదు. నిర్మల ఆదిలాబాదు మధ్యకుంటాల జలపాతముకలదు. ఇంకను ౮-౧౦ స్వాభావిక జలపాతములు కలవని ఆనివేదికలో తెలిపియుండిరి. వాటినుండి విద్యుత్తును (హైడ్రోఎలెక్ట్రిసిటీని) ఎందుకు ఉత్పత్తి చేయరు. యుద్ధంమూలాన ఇవి ఆగిపోయెను. కాని లేకపోతేనా? అని అంటారేమో యుద్ధంమూలాన మనం మన నిత్యవ్యవహారాలను వదలుకోలేదు. ఖర్చుకుభయపడలేదు. అమెరికావారు ప్రజలవద్దచేసిన అప్పుదాలకొలది అప్పును వింటే మూర్ఛపోవలసినదే. ఇంగ్లీషువారిఅప్పు కూడా అట్లాంటిదే. అమెరికావారు యిప్పుడు దినానికి రూ॥ ౧౦౦ కోట్లను మించిన వ్యయంచేయుచున్నారుకదా. ఇంగ్లీషువారు దినానికిరూ॥ ౨౦కోట్లు వ్యయముచేయుచున్నారుకదా, మనంమన రాష్ట్రవిద్యుత్తుకై ఎందుకు అప్పుచేయరాదు. చేసి ఆపనిని ఎందుకు ప్రారంభించరాదు. చేస్తాముకాని దానికితగిన మెషీనులు మనదేశములోదొరుకవుకదా అంటారేమో. ఇదే పరమరహస్యం. మనదేశములో మెషీనులుదొరకవు ఎంతకాలము మనకీదుర్గతి! అయినా యుద్ధానంతరం చేయవలసిన ఘనకార్యాలకుగాను మనరాష్ట్రములోఒక ప్రత్యేక కచేరిని అప్పుడే ఏర్పాటుచేసినారు. వారేమిచేయుచున్నారో ప్రజలకింకా తెలుపలేదు. తెలుపకపోతారా తెలుపుతారులెండి. వారు యుద్ధం ముగిసిన వెంటనే యీపనులు సాధించుటకై ఏర్పాటుచేసి యుంచునురుగాక. కొన్ని కాలువలను త్రవ్వుచున్నారు. వాటినుండి కొన్ని జలపాతములను (Drops) ఏర్పాటు చేయుచున్నారనుకొంటాము. ఈ ప్రకారంచేస్తే రాష్ట్రంలోని జిల్లాలకు గ్రామాలకు విద్యుత్తు సప్లయికాగలదు. గృహపరిశ్రమలు అపారముగా వృద్ధికి రాగలవు. మైసూరులో ఏనాడో శివసముద్ర జలపాతము (గంగనచుక్కి)తో పనితీసుకొనుచువచ్చినారు. ఇప్పుడు గెర్సొప్పా జలపాతాన్ని వినియోగించి విద్యుత్తును సిద్ధముచేయుటకు ఏర్పాటు చేయుచున్నారు. కాని మనము ఈవిషయములో వెనుకబడిపోయినాము. మనది అగ్రస్థానం. మనం వెనుకపడరాదు. విద్యుత్తులో మనమే అగ్రస్థానం వహించవలెనేకాని రాతిబొగ్గుపై ఆధారపడి విచారపడుట తగదు.

ఈనెల హైదరాబాదు సమాచారాలలో ఒకవార్తయున్నది. ౫౨ లక్షలకు పైగా వ్యయము నిజాంసాగరు కాలువక్రింద ఒక జలపాతం ఏర్పాటుచేయుట కేర్పాటుచేయుచున్నారు. ఇది సువార్త. కాని ఇచేసాలది ఇది చాలని స్వల్పము. పెద్దపెద్ద పథకముల క్రిందను ఏర్పాటు ఎన్నడుచేయుదురో నిరీక్షించుచుందుము.

---

సాటాన్న, సెప్టెంబరు

సాటాన్న మెడికల్ కాలేజీ ఆసుపత్రిలోకిపోయి [illegible] తిండిలేక మాడుచున్నవారలు [illegible] చేర్చబడినారు.

---

### అజ్మీసు వరదలకు

### ౧౪౦౦౦ మంది ఆహుతి

కలకత్తా సెప్టెంబరు ౮

అజ్మీరుమెర్వారాలో వరదలవల్ల ౧౪౦౦౦మంది జనమున్ను ఒకలక్షపశువులున్ను మరణించినట్లు వరదల బాధకలిగినచోట్ల సహాయము జరుగుచున్న ప్రకారమును చూచుటకై మార్వారి బాధా నివారణసమితియొక్క ప్రతినిధులవల్ల తెలిసినది.

### హైదరాబాదులో

### 33 మంది సత్యాగ్రహుల

### విడుదల

హైదరాబాదు (దక్కన్) సెప్టెంబరు ౯

సత్యాగ్రహముచేసినందుకై శిక్షితులైన ౩౩మందిలో ౩౩మందిని మ. మ. మ. నిజాంప్రభుత్వమువారు వదలిపెట్టినారు. ౧౯౪౨ ఆగష్టులోను, తరువాత నెలలలోను కాంగ్రెసు అల్లరులసందర్భమున అరెస్టుచేయబడినవారలలో ఇప్పుడు ౧౨మందిమాత్రమే జెయిళ్ళలోనున్నారు. వీరలలో ౫గురు న్యాయస్థానములో విచారణ జరుపబడుచుండ నైలులోనున్నారు. వారలవిషయమై అప్పటిప్పుడు పునరాలోచన జరుగుచునేయున్నది.

---

### జిన్నాగారికి ఖాక్సారులు

### వ్రాసిన బెదరింపు లేఖలు

కోర్టువారికి చూపబడుట

పోయినజూలై నెల ౨౬ తేదినాడు జిన్నాగారిని కత్తితో పొడిచినట్టివాడని చెప్పబడుచున్న మహమ్మదుసాదిక్ అనునాతనిపై అభియోగముయొక్క విచారణ బొంబాయినగరమునందు ప్రధానరాజధాని మేజిస్ట్రేటుఅగు మిస్టర్ బ్రౌన్‌గారి కోర్టులో సెప్టెంబరు ౬తేదిన ప్రారంభమైనప్పుడు నిందితుడు జిన్నాగారినికొట్టినసమయమునందు జిన్నాగారు ధరించియుండిన కోటుగాచినిగిన, రక్తపు మరకలుగల కోటు యియున్నది. జిన్నాగారు రాజకీయసమస్యనుపరిష్కరించుటకై గాంధిమహాత్మునితో సభాషించుటకు ప్రయత్నించవలెనని కోరుటకై జిన్నాగారికి ఖాక్సారుసంస్థలోని సభ్యులు పంపించినవందలకొలది టెలిగ్రాములును లేఖలును, జిన్నాగారు బ్రిటిషువారు చెప్పినట్లు ఆడుచున్నారని దూషించుచు, వారిప్రాణమునకు ఉపద్రవము కలుగగలదని బెదరింపువ్రాతలు గలిగినట్టిలేఖలు అనేకములును న్యాయఅధ్యక్షాధికారికిసాక్ష్యనిమిత్తము ప్రదర్శింపబడినవి.

---

### గడ్డం కరారునామా

బొంబాయి సెప్టెంబరు ౮

హైకోర్టున్యాయమూర్తియగులో ఖాసుగారు దావూదిబోహ్రాజాతియొక్క ప్రధానపురోహితుడగు సర్దారు సయ్యదునా సైఫుద్దీన్ ముల్లాజీసాహెబున్నాల్ కాజీ కోర్టువారిచే ఫజల్‌హుసేన్ హైన్. బగోమూసాంగాని పక్షమున రూ ౬౦౦ లకు ఇవ్వబడిన డిక్రీలిగద్దుచేయించుటకై చేసినమూంశాముల్లోసిచేసినారు.

అమూనాధాయాదిచేత్రిలో గడ్డము తొలగించకపోయిన యువకునికి ఒక సంవత్సరమువరకు గడ్డమును ఉంచుకొనగలనని చేసినవాగ్దానమునకు జమానతుగా ఉంచబడిన రూ ౬౦౦లను గురించినది. ఈవరకును ఒప్పుకొనినపిమ్మట నేప్రతివాది ఆవిదాహామును అనుమతించెనని వాది చెప్పెను. ఈపనగనుసునెరవేర్చినపిమ్మటకూడ ఆజమానతును తనను ప్రతివాదికివిరిగి యివ్వలేదని వాది మొఱపెట్టుకొనెను.

---

### ముఖ్యమైన ప్రకటన

కోఆపరేటివు షోరూమ్సువారు

1 సెప్టెంబరు 1943 నుండి, సెంటుజార్జి చర్చి ఆబిదురోడ్డు కెదురుగా మరియొక కార్యస్థానము నేర్పాటు చేయుచున్నారు. షాహ్రా ఉస్మానియందున్న యిదివరకు ప్రదేశము ఆఫీసుగాను, సెంట్ జార్జిచెర్చి కెదురుగా షోరూమున్ను ఉండును. గాన గ్రాహకులు గమనించి తమ తమ అవసరములను బట్టి ఆయాస్థలములకు దయచేయగలరు.

కోఆపరేటివ్
షోరూమ్సు

ఆఫీసు — షాహ్రా ఉస్మానియ

మరియు

ప్రదర్శనశాల- సెంటుజార్జిచెర్చికె
ఎదురుగా, ఆబిదురోడ్డు, హైదరాబాదు-

ZIA

---

## ఇటలీ ప్రభుత్వము బ్రిటిషువారికి

## లొంగిపోవుట

### ఇటలీఉత్తర, మధ్యభాగములను జర్మనులుఆక్రమించుట

ఇటలీలో బ్రిటిషుపక్షసేనలతో పోరాడవలసి వచ్చినసేనలన్నియు పోరాటమును మాని బ్రిటిషుపక్షసేనలకు లొంగిపోవలసినదని ఇటలీయప్రభుత్వమువారు ఆజ్ఞచేసినారు. ఆప్రభుత్వముయొక్క ప్రతినిధి బ్రిటిషుపక్షసేనలప్రధానాధికారియగుటయె జెనరల్ ఐసెన్‌హోవరుగారి ప్రతినిధితో కలిసి యుద్ధవిరామసంధిపత్రమునకు ఒప్పుకొనినట్లు సెప్టెంబరు ౩వతేదిన బ్రిటిషుపక్షసేనల ప్రధానకార్యాలయమునందు సంతకముచేసినారు. ఇటలీయప్రతినిధులు ఈయుద్ధవిరామసంధి బ్రిటిషుమిత్రమండలివారికి అనుకూలమైన సమయములో అమలుజరుపబడుటకు ఒప్పుకొనినారు.

ఈయుద్ధవిరామసంధిని పకుర్చుకొనుటకై కొన్నివారములక్రిందనే ఇటాలీయప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వముతోను అమెరికాప్రభుత్వముతోను రాయబారాలు ప్రారంభించియుండెను. సుమారు ౧౫రోజులక్రింద ఒకఇటాలియాధికారి యీయుద్ధవిరామప్రసంధిని కుదుర్చుకొనుటకై సిసిలీలోని పాలెర్మో విమానాశ్రయమునందు విమానములో వచ్చియుండెను. ఆతడు అక్కడనుండి బ్రిటిషుపక్షాధికారితో మాట్లాడెను ఇటలీయప్రభుత్వము ఎక్షేపరతులనుగాని విధించకుండ బ్రిటిషుపక్షమునకు లొంగుట అవసరమని స్పష్టముగా కోరబడెను. దీనికి ఒప్పుకొన్నతర్వాత ఎట్టిమిలిటరీ సంబంధములైనషరతులతో యుద్ధవిరామసంధి చేయుటకు బ్రిటిషుపక్షమువారు సమ్మతింతురో తెలుపబడునని స్పష్టపరచబడెను. మరియు ప్రస్తుతమిలిటరీషరతులుమాత్రమే విధించబడును గాని, ముందుకు బ్రిటిషుపక్షమువారు విధించబోవు రాజకీయ ఆర్థికషరతులనుకూడ ఇటాలియ ప్రభుత్వమువారు ఒప్పుకొనుటకు ఇప్పుడే అంగీకరించవలెననికూడ నిర్బంధము చేయబడెను. ఇన్నిటికిని ఇటాలియనులు ఒప్పుకొని సిసిలీలో సెప్టెంబరు౩తేదిన యుద్ధవిరామసంధిపత్రముపై సంతకములు పెట్టిరి.

ఇప్పుడు ఈసంధిపత్రమందు తెలిపిన మిలిటరీ షరతులను బ్రిటిషువారును, అమెరికావారును మాత్రమేగాక రష్యావారుకూడ ఆమోదించినట్లు తెలుపబడినది, యుద్ధవిరామసంధి సెప్టెంబరు ౮తేదినుండి అమలులోవచ్చినట్లు ఇటలీలో బ్రిటిషుపక్షమున పోరాడుచున్న సేనలన్నిటి సర్వాధికారియగు జెనరల్ ఐసెన్‌హోవరుగారు ఆనాడే ప్రకటించినారు.

ఆమిలిటరీషరతులేవియో ప్రకటించుటకు ఇప్పుడు తగినసమయముకాదని జెనరల్ ఐసెన్‌హోవరుగారనినారు. అయితే మధ్యధరాసముద్రప్రదేశమంతకు బ్రిటిషునౌకాదళముయొక్క సర్వాధికారియగు కనింగ్‌హాంగారు మధ్యధరాసముద్రములోనిఇటాలీయనౌకలు వెంటనే బ్రిటిషుపక్షమువారి అధీనంలోనుండే జిబ్రాల్టరు, ట్రిపోలి, మాల్టా, హైఫా, అలెగ్జాండ్రియా రేవులలో దేనికైనా చేరుకొనుననియు, ఇతర సముద్రపు రేవులలోనుండే ఇటాలీయనౌకలు రష్యావారిరేవులను చేరుకొనుననియు, గ్రీసుపక్క ఈజియను సముద్రములోనుండు ఇటాలీయవర్తకనౌకలను జర్మనులు పట్టుకొనేటట్లు ఉన్నచో వాటిని ఇటాలీయనులే ధ్వంసముచేయవలెననియు ప్రకటించినారు. మధ్యప్రాచ్యములో బ్రిటిషుపక్షసేనల ప్రధానాధికారియగు సర్ హెన్రీమెయిట్లాండువిల్సన్ గారి ప్రతినిధి బాల్కనుప్రాంతములలోను, ఈజియన్ సముద్రప్రాంతములలోను, ఇటాలీయసేనలు బ్రిటిషుమిత్రమండలి సేనలను ప్రతిఘటించవలెననియు, డోడెకనీసు ప్రదేశములలో జర్మనులాక్రమించిన అన్నిప్రదేశములను బలాత్కారముగ గుంజుకొనవలెననియు- బ్రాడుకాస్టు చేసినారు.

ఇటలీ బ్రిటిషుమిత్రమండలివారికి లొంగిపోవుటకు కారణములను బడాగ్లియోగారు సెప్టెంబరు ౮తేదిన హిట్లరుగారికిని, తక్కినజర్మనుపక్షపు నాయకులను టెలిగ్రాముద్వారా తెలియబరచినారు. ఇటలీలో శత్రువులనాపుకొనుటకు ఏర్పరచుకొనిన రక్షణమార్గములు భగ్నములైనవి. పరిశ్రమలుభగ్నములైనవి. రైలుబాటలు, నౌకాబలములు ధ్వంసములైనవి. ఇంకాయుద్ధమునుసాగించినచో ఇటలీసేనకంటె ఎక్కువబలముగల బ్రిటిషుపక్షసేనలతోపోరాడక ఇటలీ సేనలు ఓడిపోవలసివచ్చుటయేగాక దేశమునకుకూడ చాల క్షోభ కలుగునను తలంపుతో ఇటాలీయప్రభుత్వమువారు లొంగిపోవలసివచ్చినదని ఆ టెలిగ్రాములో తెలుపబడినది.

---

### పోషించలేక పిల్లలను

### చంప యత్నించిన తల్లి

మదనపల్లి, సెప్టెంబరు౯

ఇక్కడికి సమీపమున ముమ్మనగుట్టమనుగ్రామమందు వెంకటమ్మ అనునామె తన ముగ్గురుబిడ్డలను పోషించలేక వారలను నీళ్ళలోముంచి చంపివేయుటకు యత్నించబోగా ౫ఏండ్లబిడ్డ కేకలుపెట్టి తప్పించుకొనిపోయెను. ఈ కేకలువినపడి జనులు అక్కడికిచేరేలోగా తల్లియు ఒక బిడ్డయు మరణించిరి. ఇంకొకశిశువును అక్కడికివచ్చిన జనులు రక్షించగలిగిరి.

---

తామ్లుక్, సెప్టెంబరు౭-

నందిగ్రామములో తిండిలేని కారణముచేతనో మహామారివల్లనో చాలమంది మరణించినట్లు మిడ్నపూరులోనిబాధానివారణసమితి కార్యదర్శియగు డాక్టరు సి-సి భౌమిక యం.యల్.ఏ గారికి సమాచారము తెలిసినది. శవములుకాలువలలోనో, లేక రోడ్లప్రక్కనో పడవేయుచున్నారు, దహనముసాధ్యముకానట్లు కనిపించుచున్నది

సుతాహాటలో తిండిలేనికారణముచే రోజుకి ౩౦మందియు, మాహిషాదల్‌లో రోజుకి ౭౫మందియు, తామ్లుకులోరోజుకి నల్గురైదుగురును, తామ్లుకుఠాణాలో సుమారు ౮౦మందియు మరణించుచున్నారు.

## అలంపూరు

### అతివర్షము

(స్వ వి.)

మా తాలూకాలోను ఇతరగద్వాల కొల్లాపుర ప్రాంతాలలోను విపరీతముగా వానకురిసినది. ఇంతటితో ఆగేటట్టు లేదు. మిరుపనారుకుతప్ప అంతటికీ నీవర్షము మంచిదే కాని ఎక్కువ మోతాదైతే ఎదీ కూడా బాగుండదు. మొత్తముకు కొంతఆర్థమూపంటు మసాప్పటికపంటకు కొరతవుండదు భగవంతుని అనుగ్రహమువల్ల కరువుతప్పిపోయినది.

### సర్కసు

సర్కసుఅనేపేరుతో పల్లెలలో రాంయాపాయలు వసూలుఅయినవి. కాని ఏవో కొందరువచ్చి స్కూలుకంపోండులో భరతనాట్య ప్రదర్శనము చేసి మరుదినమే పోయిరి. డబ్బునిచ్చినవారు పల్లెలవారు-చూచి ఆనందించినవారు అలంపూరుతెల్లబట్టలవారు ఏదిఎట్లయితేనేమి భరతనాట్యముకూడా శర్కసులో చేరిపోయినది. ఎవరోఒకరు చూచినారు.

### ధర్మకర్త

మాఅలంపూరులో బ్రహ్మేశ్వరస్వామి ఆలయం సుప్రసిద్ధమువారే గోసుయార్జంగుసాహేబుసుబేదారుకాలంలో దేవాలయానికిఒకకమిటీని ఏర్పరచిరి. కొన్నాళ్లుబాగానేజరిగింది. శాలారిష్టాలు మొదలై తగినవాండ్లుచావడం కొందరురాజీనామాలుఇవ్వడంజరిగి చివరకుహతశేషులైన ఇప్పటి ధర్మకర్తగారికి టెంపుల్ కమిటీ ప్రసిడెంటుపదవి ప్రాప్తించింది. దీనికేమిఎన్నికలు అవసరంలేదు. తాలూక్దారుగారికి కొంతఅధికారమున్నది వారిదృష్టిపడితేనే కొత్తప్రసిడెంటు కనీసంమూడేండ్లకొకసారియైనా ప్రజలయెన్నికలతో ప్రసిడెంటుఏర్పడేపద్ధతిఏర్పరిస్తే బాగుంటుంది కాని మతశాఖవారు ఇట్టిప్రజాహితాన్ని లక్షిస్తారా? దేవాలయముభూములు ఏకవర్ష వ్యవసాయమునకు వేలంఅవుతూండేవి. టెంపుల్ కమిటీప్రసిడెంటుగారేహక్రాజావరికిని తెలుపకుండా తీసుకున్నారు తమకనువాలమైనభూములు ఇతరులుచేస్తే ఇంకాఎక్కువ ఆదాయంవచ్చేది.

మాతహసీల్దారుసాహెబుప్రత్యేకశ్రద్ధవహించుటచేత జరిగే రథోత్సవం ఆగిపోయెను.

ఆలయానికి అనుబంధముగా ఒకసత్రంవుంది. దానికికొంతభూమి యినాముంది. యినాముఆయన ఖిజ్జాఆయిపోయింది. దానివిషయమెవడికి తెలీదు. ఆయనసొంతమేఅని వ్యవహరింపబడుతూవుంది. ఆ సత్రానికివంటవారు ఎవరుకదిరినా నెలకంతేప్పించెక్కువవుండరు. కారణము? సత్రంపనేకాక ఆయన యింటిపనికూడా చేయవలెను.

ఇతశాసనాలు ఎక్కడిశాసనాలు అక్కడనే మాయంచేస్తున్నారు. ఆయనకుపనికిరాకపోతే ఇతరులకుమాత్రము ఎందుకుపనికిరావాలె. ఎవరెంత ప్రార్థించినావినకుండా శాసనాలను బూడ్చినారు. మనరాష్ట్రములో ఆర్కియాలజికల్ డిపార్టుమెంటుకలదు. దానికీవిషయాలు తెలుసునోలేదో

### గ్రామకమిటి స్థాపన

పాలేరుపట్టికమిటీ అధ్యక్షులగు శ్రీమన్యవెంకట రత్నయ్యగారిఆధ్యక్షతన చెన్నారంగ్రామ ప్రాథమిక సభ్యుల సమావేశముజరిగి గ్రామకమిటీనిస్థాపించటమైనది. అధ్యక్షులు శ్రీ రావులపల్లి సుబ్బారావుగారు, కార్యదర్శి శ్రీ గుళ్ళపల్లి వీరరాఘవరావుగారు, సభ్యులు ౧ శ్రీపర్వతనేనివెంకటరామయ్య, ౨ సూర్యనేని సత్యనారాయణ, ౩ తమ్మారెడ్డిచాలకోటయ్య.

## బెంగాలు క్షామభీబతులకు సాయం

జోగిపేట భాద్రపద ౩౹౹౩ సోమవారం స్థానిక ఆర్యసమాజమువారికి నిజాంరాష్ట్ర ఆర్యప్రతినిధివారు కలకత్తాబెంగాలుక్షుద్బాధితులకు ద్రవ్యసాయముపంపుమని అపీలుచేసినందున శ్రీమాన్ ముదల్ కర్ గోవిందరావుగారు, శ్రీఆర్ జ్ఞానేంద్రగారలు స్థానికవ్యాపారులనుండి (రు.౨౦౹) చందాచేసి ఆర్యప్రతినిధిసభవారికి పంపనయినది

ఆర్యసమాజమంత్రి.

### వరంగల్

(ఒవి)

దిఃః౧-౯-౪౩ వరంగల్ హైస్కూల్ కళాశాలకు శ్రీ వేః ప్రఃః వేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ (౧౦౦౮) కాంచీపురం ప్రతివాది, భయంకరం కృష్ణమాచార్యస్వామివారు వేంచేసి కళాశాల ఉన్నతినిగూర్చి ఉపన్యసించిరి. శ్రీవారికి కళాశాల కార్యకర్తలు బహుమతుల నొసంగిరి.

శ్రీ రామలింగేశ్వరస్వామివారి దేవాలయమున శ్రీగజానన మండలివారి నవరాత్రి సందర్భమున ౫-౯-౧౯౪౩ నాడు బ్రః శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి గానసభ అతిమనోహరముగా వేలవేలు సభికుల నానందపరవశుల జేసెను మరియు శ్రీమాన్ పండితరుద్రదేవుగారు ౨౩-౯-౪౩ సత్కర్మధర్మలవిషయములో అతివిస్తులముగా నుపన్యసించిరి. వీరిగంభీరోపన్యాసము శ్రోతలమనంబుల నెంతయో నుత్సాహభరితుల జేసెను.

## విద్యుల్లేఖ

కాగిదాలకరువులో కర్నూలులోని ఆంధ్రకావ్యకళాసమితివారు విద్యుల్లేఖఅను చిన్నసంపుటము ప్రకటించినారు. (వెలగింతరాలు) అందు సు-ప్రతాపరెడ్డి పం. చి, మ- వీరభద్రశర్మ, ఆ సుబ్రహ్మణ్యశాస్త్రి గాఃమల్లికాకృష్ణశర్మ గారలుమున్నగువారింకా అందుందివరకు విమర్శలు, పద్యాలు వ్యాసాలు వ్రాసినారు. రాయలసీమలోని కవిపండితులకే ఇందుస్థానముండుటబావ్యము ముందుసంచికలో ఆసీమలోని పూర్వకవులు, ఆధునికకవిపండితులు ఎవరో ఒకపట్టికనిచ్చి ఎవ్వరైనా వ్రాయుటబాగుండును- రాయలసీమలోని పూర్వాధునిక కవిపండితులసంగతి యితరప్రాంతాలవారికి తెలియనందున రాయలసీమనుగురించి సాహిత్యగ్రంథాలలో తగినట్లుగా చర్చించుటలేదు- రాయలసీమలోను అందులోను కర్నూలులోని మండలి కాన కర్నూలుజిల్లాలోనుకల అముద్రితగ్రంథాలపట్టికను ప్రాప్తస్థానములతెలుపుచు ఎవరైనాప్రకటింపవలెను- చారిత్రికదుర్గాలను, శిల్పాలుకల ప్రాచీనక్షేత్రములనుగూర్చి సంగ్రహముగా నెవరైనా వ్రాయవలెను. ఇప్పుడుమాకు పంపబడిన విద్యుల్లేఖను స్వాభిభాల ప్రశంసించుచు ఆత్యంపాదవర్గమువారగు చెన్నుభట్ల వేంకటకృష్ణశర్మగారిని, గడియారం రామకృష్ణశర్మగారి, స్వీతిమ్మారెడ్డిగారిని ప్రశంసించుచున్నాము- మరొకమాట కర్నూలుజిల్లాలో శిలాశాసనాలు, రాగిరేకుశాసనాలు, ముద్రితముకానివున్నచో యీసమితివారు వాటిలిపముకూర్చి ప్రకటించవలెను-మఖలో పుట్టి పుబ్బలోగిట్టకుండా యుండు సమితులు మనకుకావలెను- ఈప్రచారములో కీర్తివచ్చినదికదా అని ఈసమితివారు నిద్రింపకుందురుగాక-

### మఖ్తల్

(స్వవి.) ౨-౧౨-౧౩౫౨ఫ

ఇచ్చట వర్షములు లేక చేలువాడిపోవుచుండెను-వారమురోజులనుండి వర్షము కురియుచున్నది-వేరుశనగ, పునాసపైరులు కోలుకొనినవి తండ్రి నెలక్రిందట చెరువునకు నీళ్లువచ్చియుండెను-రెండుమాసములవరకు ఆగుచుండెనుకాని నీళ్ళు వదలలేదు. అవి యెండిపోయెను- మళ్లీ మొన్నటివానల మరిరెండు నెలలవరకువచ్చినవి. ఇప్పుడుబావులక్రింది భూముల సేద్యమునకు తహసీలుదారు అనుమతికై కాచుకొనియున్నారు.

మాఆంధ్రవాణి గ్రంథాలయము పదిహేనరోజులనుండి సక్రమముగ నడపుట కేర్పాట్లుజరిగినవి.

వర్షమురానందున భజన యేర్పాట్లు శ్రీయుత శివరామసింగుగారు ప్రభాతకాలమందుచేసిరి. ఆరంభమైననాడే వర్షముపడినది.

### ఈరానీలు

నిన్నటిదినము ఇచ్చటికివచ్చినారు. మా సబు ఇన్స్పెక్టరుగారుమాత్రము వారలనందరిని తమ నిగ్రానిలోయుంచుకొని జవానులనువెంబడించి ఊరిలోకిపంపుచుండిరి. వారికై మంచిగా నిగ్రానియుంచినారు-

### గ్యాసునూనె, రవ్వశక్కర

గ్యాసుహూనెకోపరులు చాలతక్కువయిచ్చుచున్నారు. ర్యాషన్ వచ్చి బీదసాదలకు గీకటిండ్లలోవుండవలసెనని చింతిల్లుచున్నాము. దయచేసి ప్రతివారికి తగినంతగ్యాసుహూనె యిచ్చునట్లు ప్రభుత్వమువారు యేర్పాట్లుచేయుదురని మనవి, రవ్వశక్కర పెద్దవారికేమాత్రము సోమ గురువారము దొరకును

### నూతనగజానన మండలి

సంగాపల్లె వరంగల్ తాలూకాలోనిది. స్థానిక సభ్యులగు శ్రీమధుసూదన్ రావుగారు, కుంట పెల్లిదుర్గారావు, వీమన్ రావు, సుదర్శన్ గార్లసహాయమున భాద్రపద ౹౹౪ నాడు సైమండలి స్థాపితమయ్యెను.

(స్వవి)

బొంబాయి ౫-౯-౪౩ కామాటిపురము ఆర్యసమాజములో సత్యార్థప్రకాశ ముజయంతి గొప్పగాజరుపబడెను. ౧౦-౯-౪౩ నాడు తెలుగులో సత్యార్థప్రకాశము కధారూపముగా టి యాదగిరిఆర్యగారుచెప్పిరి. పిమ్మటఒకసార్వజనసభజరిగెను. అందు ఈతీర్మానము చేయబడెను.

ధర్మసత్యార్థప్రకాశము ఆర్యుల ధర్మగ్రంథమగుటవల్ల ఆట్టిగ్రంథముపై శ్రద్ధాప్రేమలుయుండుట స్వభావికమే. కావునదీనినిరక్షించుట ప్రతి ఆర్యుని ప్రతిహిందువునిపరమకర్తవ్యము. సమాజీయుడు సత్యార్థప్రకాశమును, రక్షించుటలేన నిజధర్మముగా నెంచును మరియు ఈకార్యములో అవశ్యకతగల్గినచో మహాత్యాగమును మరియుప్రాణము అనైన బలిదానముగానిచ్చుటకైసిద్ధముగానున్నారు.

### రామాజిపల్లి

(స్వవి) ౨౦-౧౨-౫౨

నిన్నటిరోజున మాగ్రామమునకు ఆంధ్రోద్యమ ప్రబోధమునకై మెదక్ జిల్లాకమిటి కార్యదర్శి వెంకటరాజేశ్వరజ్యోతిష గారు, ఏతెంచియు డిరి. పురవాసుల ఇష్టాగోష్టిసమావేశముజరిగెను. ఆంధ్రమహాసభ ఆశయములను తెలిపినతమపరి జిల్లాకమిటికి, ౨౫ప్రాథమికసభ్యులుగ చేరిరి ప్రాథమిక సభ్యులసమిష్టిసమావేశముజరిగి ఈక్రిందివిధముగ, గ్రామకమిటి ఎన్నుకొనబడెను.

కొత్తఆగమయ్యఅధ్యక్షుడు, దుర్గన్నగారి దేవయ్య కార్యదర్శి, కోకొండవీరలు, మునిగ్యాలగంగయ్య, అవులలనారాయణగారలు సభ్యులు

## కాశ్మీరమునుండి బహదర్ ఖాన్ గారి ఉద్వాసన సంగతి

### కాశ్మీర ప్రభుత్వము తెలిపిన విషయమునకు ఖండన

కాశ్మీరసంస్థానమునుండి బహదర్ ఖాన్ గారిని బయటికిపంపించివేసిన విషయమునుగురించి కాశ్మీరప్రభుత్వమువారు తెలిపినసంగతులను అఖిల కాశ్మీర ముస్లింమహాసభయొక్క అధ్యక్షుడగు చౌదరి గులాంఅబ్బాస్ గారు ఖండన చేసినారు. ప్రభుత్వమువారు అసలుజరిగినసంగతులను మసిబూసిమారేడుకాయచేయుటయేగాక, కొన్నిటిని తెలుపక వదలివేయుటయు. కొన్నిటిని క్రొత్తగా కల్పించుటయు జరిగినవి. కాశ్మీర ప్రభుత్వమువారు బహదర్ ఖాన్ గారి విషయమున చేసినపని ఎంతేయు అమర్యాదగాను, క్రూరముగానుడ దెనని నేనింకను ధైర్యముచేసి చెప్పగలను. ప్రభుత్వమువారు ఈ విషయమునుగురించి విచారణచేయుటకు ఒకసమితిని నియోగించినచో దానినిర్ణయమునకు కాశ్మీర సంస్థానపు ముసల్మానులైనను బద్ధులై యుండగలరని నేను నమ్మకముతో చెప్పగలను

ఉపన్యాసకులను నిగ్రహములో నుంచుకొనజాలనందువల్లను, అందువల్ల ప్రభుత్వమువారు ఆనిషయమున చర్యగైకొనవలసివచ్చుననియు, అపుడు వినుపరిస్థితి ఏర్పడగలదనియు, అందుచే వార్షిక సమావేశమును ఆపివేయవలెననియు తీర్మానించినట్లు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినవారు ఒప్పుకొనిరని ప్రభుత్వప్రకటనలోనాఖ్యానికారి తెలపినాడు. ఈమాటయు కేవలము అసత్యము. నాఅధ్యక్షోపన్యాసము పత్రికలలో ప్రకటితమైనది, మహాసభకు వచ్చినవారలకు ఆముస్లింవార్షికమహాసభను మాకు కొనుటకు బహదర్ ఖాన్ గారిని అవిధముగ చేసినందుకు మహాసభను జరుపుకొనువిషయములో అవమానకరములైన షరతులను విధించినందుకును అని తెలియను మహాసభను మానివేయుటకు పూర్వము ౧౫మంది ఉపన్యాసముల నిచ్చిరి.

హైదరాబాదు రక్షణ నియమముల క్రింద మూలధనమును జారీచేయుటకు హిజ్ ఎక్సెలెన్సీ ప్రధానామాత్యుల అనుమతి పొందనైనది.

వాటాలను తీసుకొనుటకు 30 ఆగస్టు 1943 నాడు ఉదయం గం. 10-0 లకు మొదలు చేయబడి 29 సెప్టెంబరు 1943 నాడు గాని, జారీచేయబడిన మొత్తము పూర్తి అయినచో అంతకుముందుగా గాని పూర్తిచేయబడును

---

# ది హైదరాబాదు

# ఆయిల్ అండ్ పెయింట్

## కం. లిమిటెడ్ యొక్క

# ఉద్దేశ ప్రకటన పత్రము

(హైదరాబాదు దక్కన్ కంపెనీల చట్టము IV ఆఫ్ 1320 ఫ. క్రింద స్థాపించబడినది

అధికార మూలధనము హాలీ రు. 10.00.000/-(హాలీ పది లక్షలు)

ఇది ఒక్కొక్కటి హాలీ రు20/—వంతున 50,000 వాటాలుగా విభజింపబడినది.

జారీచేయబడిన మూలధనము హాలీ రు, 5,00,000 (హాలీ అయిదు లక్షలు)

ఇది ఒక్కొక్కటి హాలీ రు, 20—వంతున 25,000 వాటాలుగా విభజింపబడినది

ప్రస్తుతము జారీచేయబడి ఒక్కొక్కటి (హాలీ రు 20/ — విలువగల్గి మొత్తము హాలీ ఐదు లక్షల విలువగల్గిన 25,000 వాటాలలో, ఒక్కొక్కటి హాలీ రు 20— విలువగల్గి మొత్తము హాలీ రు 4,40,000 విలువ గల్గిన 22,000 వాటాలకుమాత్రమే దరఖాస్తులు కావలయును, మిగిలిన 3,000 వాటాలను, డైరెక్టర్లు మరియు మేనేజింగ్ ఏజంట్లు తీసుకొనుటకు యిదివరకే ఒప్పుకొన్నారు.

పైజెప్పిన వాటాలు యీవిధముగా చెల్లింపబడవలయును.

దరఖాస్తుతో హాలీ రు 5—, పంపిణీ అయినతరువాత హాలీ రు5/.

మిగత హాలీ రు. 10/—లు, వాటాల పంపిణీ అయినతరువాత డైరెక్టరుల నిర్ణయముప్రకారము రెండు పర్యాయములుగా, ఒక్కొక్కదానికి మధ్య మూడుమాసములకు తక్కువగాని వ్యవధితో, చెల్లింపబడవలసియుండును

## డైరెక్టర్లు

1. నవాబ్ అహాసన్‌యార్‌జంగ్ బహద్దర్, యం.ఐ.ఇ (ఇండియా) ఏ.ఐ.ఇ, (కూపర్స్ హిల్, ఇంగ్లండు) రిటైర్డ్ చీఫ్ యింజనీర్ పి.డబ్ల్యు.డి, మరియు మ.ఘ.వ. నిజాం ప్రభుత్వమునకు కార్యదర్శి — అధ్యక్షులు,
2, పింగిలి వెంకట్రామారెడ్డిగారు దేశముఖు, ది సిండియాస్టీం నావిగేషన్ కం. లిమిటెడు ది హైదరాబాదు స్టేట్ బ్యాంకు, ది డొమినియన్ కోఆపరేటివ్ బ్యాంకు, ది ఏషియాటిక్ గవర్నమెంటు లైఫ్ యిన్సూరెన్సు కం, లిమిటెడు, ది మాసర్ మిల్సు లిమిటెడు, ది మినర్వామిల్సు లిమిటెడులకు డైరెక్టరు
3, రుస్తుంజీ జె, చినాయ్‌గాగారు రిటైర్డు పోస్టుమాస్టర్ జనరల్ మ.ఘ.వ. నిజాంప్రభుత్వము దారాబ్జి బ్రదర్సు అండుకో శికింద్రాబాదులో భాగస్థులు, ది హైదరాబాదు స్పిన్నింగ్ అండు వీవింగ్ మిల్సు లిమిటెడు, ది హైదరాబాదు రోలర్ ఫ్లోర్‌మిల్సు లిమిటెడు, ది హైదరాబాదు ఐరన్ అండు స్టీల్ కం, లిమిటెడు, డైరెక్టరు
4. డి. డి. ఇటాలియాగారు, మ. ఘ. వ నిజాంస్టేటు రైల్వేయొక్క రైల్వే ఎడ్వైజరీబోర్డుయొక్క మెంబరు ది సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, హైద్రాబాదుదక్కన్‌యొక్క అడ్వైజరీబోర్డుమెంబరు. దిదక్కన్ పోర్సిలైన్ అండ్ ఎనామెల్ కం. లిమిటెడ్‌యొక్క మేనేజింగ్ ఏజంటు.—
5. తాజమల్ హంసీన్‌గారు మేనేజింగుడైరెక్టర్, తాళ్లే అండ్ గ్లాసువర్క్సులిమిటెడ్.
6. జె. ఓ. సంఘీగారు, ఎక్స్అఫిషియో డైరెక్టరు, బైయోకెమికల్ అండ్ సింథటిక్ ప్రొడక్ట్సులిమిటెడ్
7. రఘునాథ్ నాథూగారు, మెసర్సు నాథూలాల్ జీ, కింగ్సువే శికింద్రాబాదువారు
8. హబీబ్ అహమ్మదుగారు, జనరల్ కంట్రాక్టర్, హైద్రాబాదు మార్బుల్ కంపెనీ, 83, పబ్లిక్ గార్డన్ రోడ్డు హైదరాబాదు దక్కన్.యజమాని
9. జి. జె. రామశాస్త్రిగారు, ఎం. ఏ., కమిషనరు (ఎక్స్అఫీషియో డైరెక్టర్) సుల్తాన్ బజారు, హైద్రాబాదు దక్కన్

మేనేజింగ్ ఏజంట్లు:—మెసర్సు హబీబ్ అహమద్ అండ్ సన్సు, 83, పబ్లిక్ గార్డెన్ రోడ్, హైద్రాబాదు దక్కన్.

బ్యాంకర్లు,—ది సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, హైద్రాబాదు దక్కన్. ది హైదరాబాదు స్టేట్ బ్యాంకు.

లీగల్ ఎడ్వైజర్:—పింగిలి జె. రెడ్డిగారు, బారెట్లా, హైదరాబాదు దక్కన్.

ఆడిటర్లు:—మెసర్సు నటరాజ అయ్యర్ అండుకో, రెజిష్టర్డ్ ఎకౌంటెంట్సు అండు ఆడిటర్సు, హైదరాబాదు దక్కన్.

రెజిస్టర్డ్ ఆఫీసు,—83, పబ్లిక్ గార్డెన్ రోడ్డు, హైదరాబాదు దక్కన్,

## ఉద్దేశములు:

ఈకంపెనీ మెమొరాండం ఆఫ్ ఎసోసియేషన్ నందు వివరింపబడిన పెక్కుకార్యములను నిర్వహించుటకును, అందును ముఖ్యముగా ప్రస్తుతము వ్యాపారము జరుపబడుచు బాగుగా ప్రఖ్యాతముగానెంపబడిన, పెయింట్లు, వార్నిషులు తయారు చేయుటతోబాటు, పచ్చి లిన్సీడుఆయిల్ తీయుట, షీట్ బాయిల్డు, డబల్ బాయిల్డు, ఆక్సైడ్జు, బ్లోన్, మరియు స్టాండు ఆయిల్, లిన్సీడుఆయిలులు, నూనెలు, వార్నిషుపెయింట్లు, ఎనామెల్సు, పాలిషులు, ఇన్సులేటింగు వార్నిషులు, బ్లాక్, జపాన్, వైట్‌జింక్, లితోపోన్, క్రోంఎల్లో, ప్రష్యన్‌బ్లు, మొదలైనవియు, అచ్చుసిరాలు, ఆయిల్ క్లాతు మొదలైనవియు డ్రైవరియు ఆయిల్ బౌండు డిస్టెంపర్లు, డిసిన్ఫెక్టెంట్లు, మరియు యితరవస్తువులు అనగా, వ్రాతసిరాలు, కాపీయింగు సిరాలు, మొదలైనవి తయారుచేయుట, యింకా కొత్తవస్తువులను తయారుచేయుటకు పరిశోధనలు సలుపుటగూడ యీకంపెనీ యొక్క ఉద్దేశ్యమైయున్నది.

అనుకూలములు.—

ప్రతి నిర్మాణ కార్యమునందును, రక్షణ మరియు అనవము నిచ్చు వస్తువులగుటచే, పెయింట్లు మరియు వార్నిషుల తయారీ మంచి పరిశ్రమ యగునని అందరికి తెలిసిన విషయమే,

కలకత్తా, బొంబాయిలలో అన్ని అవసరములకు తగినట్లు యుండినట్టి పెయింటు పరిశ్రమలను కేంద్రీకరించి పనిచేయుచున్నను, ప్రతిసంవత్సరము భారతదేశమునకు ఒక కోటిరూపాయలకు మించిన విలువగల పెయింట్లు దిగుమతిఅగుచున్నవి, గనుక భారతీయ వ్యాపారసంస్థలు యీలోటును తీర్చవలసియున్నది,

విదేశములనుండి భారతదేశమునకు దిగుమతిచేయబడుచున్న పెయింట్లు మరియు తత్సంబంధ వస్తువుల అంకెలు.

1 ఏప్రెల్‌నుండి 31 మార్చివరకు, 12 నెలలకు

బి. జి. రూపాయిలలో విలువ

| | 1935—36 | 1936—37 | 1937—38 | 1938—39 | 1939—40 |
|---|---|---|---|---|---|
| పెయింట్లు మరియు పెయింటర్లసామగ్రి | 80,55,025 | 76,54,770 | 743,75,574 | 33,95,353 | 30,51510 |
| లిన్‌సీడు అయిల్, | 3,27,113 | 3,54,854 | 3,91,011 | 2,95 413 | ... |
| పెయింటర్ల సామగ్రి, (పెయింట్లు, రంగులు, గాక అనగాటర్పెంటైన్ ఎనామెల్సు లక్కలు యితర రకముల వార్నిషులు, పెయింట్లు) | 21,50,333 | 20 25,660 | 27,10,418 | | |
| మొత్తము | 1,05,32,476 | 1,00,33,284 | 1,04 77,003 | 61,94,271 | 3051,510 |

బొంబాయి, కలకత్తాలలో యీవ్యాపారము కేంద్రీకరింపబడి కోట్లకొలది రూపాయిల వ్యాపారము చేయుచున్నప్పటికి, హైద్రాబాదుదేశమునకు మధ్యభాగములో యుండుటవల్లను, దాని పరిసరములలో పెయింట్లకవసరమగు వస్తువులు అనగా లిన్‌సీడుఆయిల్, రెడుఆక్సైడులు, ఓక్రెసు, సీక్సెసు, టాల్కు, మరియు బారైట్సు మొదలగు అతిముఖ్యమైన వస్తువులు, (మరియు పెయింట్లకు సహకారులగు వస్తువులు, (జింకాక్సైడు, లితోపోన్, మరియు వైట్‌లెడు మొదలైనవి అందరకు సమానముగు విధముగ చిక్కునవికదు) పుష్కలముగా దొరకు అవకాశముండుటచే భారతదేశమందలి యితర మార్కెట్టులతో పోటీలోనెగ్గి శాశ్వతముగా లాభములనుపొందు స్థితిలో యున్నది, యింతేగాక మధ్యరాష్ట్రము, మరియు దక్షిణ హిందూస్థానపు మార్కెట్టులనంతటిని వశముచేసుకొని, ఈరాష్ట్ర నందు యింకా కొన్ని యిట్టికర్మాగారములు స్థాపించినను పోటీఏమియు లేకుండా మంచి లాభములతో నడుపు అవకాశమున్నది.

ఈపరిశ్రమ ముఖ్యముగా శాంతిసమయములలో నడుపుటకై పద్ధతులపై స్థాపింపబడుచున్నది.గాని ప్రస్తుత యుద్ధకారణమున యీవస్తువుల యవసరము ఎక్కువైన దున దానివల్లగల్గు అధికలాభములనుగూడ సంపాదించవచ్చును. ఇండియా ప్రభుత్వపు సప్లయికాళ్లవారి పట్టికలో ది హైదరాబాదు ఆయిల్ అండు పెయింటు కంపెనీ యిదివరకే చేర్చబడియున్నది. గనుక ప్రభుత్వమువారికి సప్లయిచేయుటకు అవకాశమున్నది.

దరఖాస్తుల వెంటను మరియు పంపిణీవెంటను వచ్చు హాలి రు 2,50 000 యీ క్రిందివిధముగా ఉపయోగించుటకు తాత్కాలికముగా ఏర్పాటుచేయబడినది యీ మొత్తమునుండి సమంజస కొంత మొత్తము వ్యాపారములు జరుపుటకై ప్రత్యేకించబడును.

| | | |
|---|---|---|
| భూమి మరియు భవనముల ఖరీదు- | హాలి రు. | 35,000 |
| తాత్కాలికముగా కొనవలసిన యంత్రములు. | .. | 40,000 |
| హైద్రాబాదు ఆయిల్ అండు పెయింటు కంపెనీ ఆస్తులు. స్టాకు. ఫర్నిచర్. మెషీనులు రసాయన పదార్థములు మొదలైనవాటితో యిప్పుడు నడచుచున్న స్థితిలో, దాని పరిశోధనలతో సహా గుడువిల్ ఏమియు లేకుండా, ధరకు .. | ,, | 41,500 |
| వ్యాపారములు జరుపుటకు మూలధనము. — | ,, | 1,33,500 |
| | మొత్తము హాలి రు, | 2, 50,000. |

కొంతకాలము గడచినతరువాత మాన్యాలుమైన కోరిక ఏమనగా, కంపెనీ సంపాదనమునుండి, వాటావారి పద్ధతులపై ప్రదర్శనశాలలను మద్రాసు, బెంగుళూరు, నాగపూరు, ఢిల్లి, ఆగ్రా, మొదలగు ముఖ్యకేంద్రములలోను మరియు కలకత్తా బొంబాయిలలోగూడా స్థాపించుటకైయున్నది. ఇట్టిపరిశ్రమయొక్క వ్యవహారఫలితములు చాలా తృప్తికరముగా యుండగలవని చెప్పవలసిన యవసరములేదు. గనుక వాటినిగూర్చి అతిశయముగా అంకెలద్వారా తెలుపుటనవసరము. కంపెనీ ప్రారంభించిన మొదటి సంవత్సరము నుండియే మంచి లాభభాగములను పంచి యివ్వగలిగినంతటి లాభము లుండగలవు.

**ఆదాయపు పన్ను:—**

హైదరాబాదు రాష్ట్రమునందు ప్రస్తుతమున్న చట్టములననుసరించి, రాష్ట్రమునందు సంపాదనపై ఆదాయపుపన్ను యిచ్చుకొనవలసిన అవసరములేదు,

**మేనేజింగ్ ఏజంట్లు —**

మెసర్సు హబీబ్ అహమదు అండుసన్సు, వారిఉత్తరాధికారులు వారికి అధికారము పొందినవారు ఈ కంపెనీకి మేనేజింగుఏజంట్లుగా 30 సంవత్సరములవరకు నెల 1కి హాలీలు 500/ వంతున ఎలవెన్సు మరియు సంవత్సర నికరాదాయములో ప్రతిశతి 10వంతున కమిషన్ తీసుకొనుచుయుండునట్లు నియమింపబడినారు, పైజెప్పిన ఎలవెన్సు మరియు కమిషనుకు కంపెనీ తిరపుచుండిరుగు యితరవ్యయములతో ఏమియు సంబంధములేదు, మేనేజింగుఏజంట్లు, కంపెనీయొక్క మూలధనములో హాలీలు25,000/ల యథార్థవిలువగల్గిన వాటాలను, వారి మేనేజింగు ఏజన్సీకాలములో తప్పక కల్గియుండుటకు బద్ధులైయుండురు,

**ఒడంబడికలు:—**

ఈక్రింది ఒడంబడికలుగా వింమకొనబడినవి,

(1) మెసర్సు హబీబ్ అహమదు అండుసన్సు, వారిఉత్తరాధికారులు మరియు వారిచే అధికారముపొందినవారు కంపెనీకి మేనేజింగుఏజంట్లుగా యుండుటకై కంపెనీ ఒకవైపున మరియు మెసర్సుహబీబ్ అహమదు అండుసన్సు రెండవవైపున కలిసి 21 ఆగస్టు 1943, తేదిన వ్రాసుకొన్న మేనేజింగుఏజన్సీ ఎగ్రిమెంటు,

(2) హైదరాబాదు ఆయిల్ అండు పెయింట్ కంపెనీని నడచుచున్నస్థితిలో తీసుకొన్నందున, కంపెనీకిని, హబీబ్ అహమదుగారికిని మధ్యవ్రాసుకొన్న 21 ఆగస్టు 1943నాటి ఎగ్రిమెంటు,

పైజెప్పిన ఎగ్రిమెంటులయొక్క నకళ్లుకంపెనీయొక్క రెజిష్టర్డు ఆఫీసు 83, పబ్లిక్‌గార్డెన్‌రోడ్డు, హైదరాబాదు దక్కన్ నందు కార్యాలయదినములలో, కార్యాలయసమయములలో చూడవచ్చును.

**డైరెక్టరుల యొక్క అభిరుచి —**

డైరెక్టర్లగు హబీబ్ అహమదు మరియు జిజెరామశాస్త్రిగారలు మేనేజింగుఏజంట్లుచే నిర్ణయింపబడినవారు, మెసర్సు హబీబ్ అహమదు అండుసన్సు తమ మేనేజింగు ఏజన్సీ ప్రతిఫలముపై అభిమానముగలవారు, హబీబ్ అహమదుగారు గూడ వారికి ఖరీదు చేయబడిన మొత్తమును పొందుటయందు అభిరుచిగలవారు,

**డైరెక్టర్ల అర్హతలు:—**

డైరెక్టరగుటకు అర్హత (ఎక్స్అఫీషియో, స్పెషల్, ఆల్టర్నేట్ మరియు డిబెంచర్ డైరెక్టరుతప్ప) కంపెనీయొక్క వాటాలు రు 5,000ల విలువగలవి గల్గియున్నచో యుండును,

**మహాజనసభలలో సభ్యులకు ఓటింగుహక్కు:—**

సమావేశములయందు హాజరైనప్రతిసభ్యునకు ఒక్కొక్కఓటుచేయు ఎర్పాటువల్లను, పోల్ పద్ధతి ప్రకారమైనప్పుడు స్వయముగాగాని, ప్రతినిధిద్వారాగాని హాజరైన ప్రతిసభ్యునకు ఆతనిఒక్కొక్కషేరుకు ఒక్కొక్కఓటు ఉండగలదు.

**వ్యవహార్తలు, ప్రాథమిక వ్యయములు:—**

మెసర్సు హబీబ్ అహమదు అండుసన్సువారు, కంపెనీయొక్క స్థాపనమరియు రెజిస్ట్రేషన్‌యొక్క వ్యవహారములన్నియుజరిపినారు. వారుసాధారణమైన ప్రాథమికవ్యయములను అనగా స్థాపన, రెజిస్ట్రేషన్ మొదలగు వాటివిషయమున అగు వ్యయములన్నిటిని భరించుచున్నారు. వారికి ఈవ్యయములు మరియు కంపెనీకనుండి యింకనుతగు వ్యయములు వారికితిరిగి పొందు హక్కుగల్గియున్నారు గనుక చెల్లించబడుదురు. ప్రాథమికవ్యయములు అంచానా (అండర్ రైటింగు కమిషన్ మరియు బ్రోకరేజి గాక) హాలీ రు. 5000/లకంటె మించవని అంచనా వేయబడినవి

ఆర్టికల్స్ ఆఫ్ ఎసోషియేషన్ యందున్న ప్రకారము కంపెనీవారు ఏసమయమునందైనను, వాటాలకుచందాచేసిన లేక చేయుటకు ఒప్పుకొన్న లేక వాటాలకు ఒప్పందముపడిన ఏవ్యక్తికైనను వాటాలయథార్థపుధరపై ప్రతిశతి 2½కుమించకుండా కమిషన్ యిచ్చుఅధికారమును గల్గియున్నారు. ప్రస్తుతముడైరెక్టర్లు, రెజిష్టరై నవాళ్లకుపొందిన బ్రోకర్లకు మాత్రము ప్రతిశతి 1½ వంతున బ్రోకరేజియిచ్చుటకు నిర్ణయించినారు.

**వాటాలకై దరఖాస్తులు —**

వాటాలకొరకు దరఖాస్తులుకంపెనీయొక్క రెజిష్టర్డు ఆఫీసునందుగాని, కంపెనీయొక్క బ్యాంకులలోగాని దొరకుప్రత్యేకమగుదరఖాస్తుఫారములపై అందలినియమముల ననుసరించి పూర్తిచేసి దరఖాస్తు వెంటచెల్లించవలసిన పైకముతో సహా పంపవలయును.

పంపిణీచేయబడని సమయములో ముందుగా చెల్లించినపైకము వాపసు చేయబడును దరఖాస్తుచేసిన వాటాలసంఖ్యకంటె యివ్వబడిన వాటాలసంఖ్యతక్కువైనప్పుడు, యివ్వబడిన వాటాలకు పంపిణీఅయినతరువాత చెల్లించవలసిన పైకముంచుకొని మిగిలినపైకము వాపసు యివ్వబడును. మొత్తములు చెల్లింపవలసిన కాలములో చెల్లించనియెడల యిదివరకు చెల్లించిన పైకములు జప్తుచేయబడును.

పైఉద్దేశపత్రము యీకంపెనీయొక్క బోర్డువారిచే 15 ఆగస్టు 1943 తేదిన ఒప్పుకొనబడినదని ధృవపరచబడినది.

(సం) అహాసన్‌యార్‌జంగ్

అధ్యక్షులు -

(Khan & Sons)

---

## ప్రకటన

ది హైదరాబాదు ఆయిల్ అండు పెయింట్ కంపెనీ లిమిటెడు, హైదరాబాద్-దక్కన్ కంపెనీస్ ఆక్టుక్రింద రిజిస్టరైనది నం. (౮) సం. బా॥ ౧౩౫౦. భాగముల కొరకు దరఖాస్తులు మెసర్సు హీరాచంద్ పూనంచంద్, బ్యాంకర్సు, జేమ్సుస్ట్రీటు, శికిందరాబాదులో తీసికొనబడును. టెలిఫోన్ నం. 2 ౨౫౩. భాగములు తీసికొనుఅభిలాషకలవారు తొందరగా దరఖాస్తులు పెట్టుకొనవలెను-

(Khan and Sons)

